### తూర్పు ఈశాన్య వీధిపోటు




వీధి పోట్లు గల మూడు గృహాలను గమనించారు కదూ.

ఒకటే విధమైన గృహములే ఒకే విధమైన వీధి పోటే. ఈ వీధి పోటును తూర్పు ఈశాన్య వీధిపోటు అని అంటాము. 1వ గృహమునకు తూర్పు ఈశాన్య వీధి పోటు కొద్ది దూరం మాత్రమే ఉంది. 2వ గృహమునకు తూర్పు ఈశాన్య వీధి పోటు 1వ గృహమునకు ఉన్న వీధిపోటు కన్నా ఇంకాస్త ఎక్కువ వుంది. అన్నింటికన్నా ఎక్కువగా 3వ గృహమునకు ఈశాన్య వీధి పోటు బాగా ఎక్కువ దూరం వుంది. వీధి పోటు అనునది ఎంత దూరం ఎక్కువగా వుంటే అనగా ఆ వీధి యొక్క పొడవు ఎంత దూరం ఎక్కువగా వుంటే అంత ఎక్కువగా దానికి శక్తి పెరుగుతూ వుంటుంది. మూడు గృహముల యొక్క వీధి పోట్లను ఇంకొకసారి బాగా గమనించండి. ఆ వీధి పోట్లలో **"స్టార్"** గుర్తులు మరియు వాటి క్రింద గల యారో మార్కులను గమనించగలరు. **స్టార్ అనగా శక్తి జనియించే స్థానంగా గుర్తించాలి.** 2వ గృహాన్ని ఒకసారి చూడండి. ఇక్కడ రెండు స్టార్‌లు మరియు రెండు యారో మార్కులు గలవు. మరియు 3వ గృహాము ను గమనిస్తే మూడు స్టార్‌లు మరియు మూడు యారో మార్కులు కలవు. ఒక స్టార్ మార్కుకే అనగా ఒక శక్తికే విపరీతమైన బలం జనించి గృహానికి అందిస్తుంది. అలాగే రెండవ గృహం యొక్క రెండు స్టార్ల శక్తి అత్యంత శక్తిమంతమై గృహానికి శక్తిని సరఫరా చేస్తూ వుంటుంది. ఇక మూడవ గృహం విషయానికి వస్తే మూడు స్టార్‌ల శక్తి మూడవ గృహానికి సరఫరా చేస్తుంటాయి. ఇక్కడ స్టార్ అనగా శక్తి జనియించు స్థానమని గమనించాలి.

ఒకటవ గృహమునకు తూర్పు ఈశాన్య వీధి పోటు వల్ల అనేక శుభాలు లభిస్తుంటాయి. అయితే మూడవ గృహానికి, ఊహించినట్లుగా అనేక శుభాలు మూడింతలుగా పెరుగుతాయని అనుకుంటాము. కానీ మూడవ గృహము ఒకటవ గృహము ఉన్నంతకన్ననూ ఇంకా ఎక్కువ విశాలము మరియు పొడవు, వెడల్పు ఎక్కువ వున్నప్పుడు మాత్రమే ఈ మూడవ గృహం మూడు స్టార్ల శక్తిని పూర్తిగా అందుకుంటుంది. కేవలం మీ అంచనా కొరకు పటములలో స్టార్‌లను మరియు యారో మార్కులను చూపించడం జరిగినది.

ఈ క్రింద పటాలను గమనించడం ద్వారా మీకు వీధిపోట్ల విషయంలో శక్తి జనియించే స్టార్ల విషయంలో అవగాహన ఇంకాస్త పెరుగుతుందని ఆశించి క్రింది పటాలను చూపించడం జరిగినది.




1, 2 గృహాలను గమనించండి. 1వ గృహము చిన్నదిగా వుంది. 2వ గృహము చాలా విశాలమైన గృహము. కానీ రెండింటికి ఉన్న వీధి పోట్లు మాత్రం సమాన కొలతలతో పొడవుగా వున్నాయి. అయితే ఇక్కడ ఒకటవ గృహం కన్నా రెండవ గృహము వీధి పోటు యొక్క పూర్తి శక్తిని పొందుతుంది. అలాగని 1వ గృహము శక్తిని పొందదని మాత్రం కాదు. కానీ 1వ గృహం కన్నా 2వ గృహమునకు వీధిపోటు శక్తిని పూర్తిగా వినియోగించుకునే అనుకూలత ఎక్కువ.

**తూర్పు ఈశాన్య వీధి పోట్లు**




తూర్పు ఈశాన్య వీధిపోటు గల రెండు గృహాలను గమనించారా, 1వ గృహము చిన్నది. 2వ గృహం చాలా పెద్దది. వీటికి గల తూర్పు ఈశాన్య వీధి పోట్లు సరైన సమాన కొలతలతోనే వున్నాయి. అయితే ఇక్కడ 1వ గృహము తన గృహానికి వున్న తూర్పు ఈశాన్య వీధిపోటు యొక్క శక్తిని పూర్తిగా వినియోగించుకుంటుంది. అయితే 2వ గృహము తన గృహమునకు వున్న తూర్పు ఈశాన్య వీధిపోటు శక్తిని పూర్తిగా వినియోగించుకున్ననూ కడుపు నిండదు. 1వ గృహంలోని గృహస్థులకు పూర్తి ఫలితాలు త్వరలో రాగలవు. 2వ గృహంలోని గృహస్థులకు పూర్తి ఫలితాలు కాస్త ఆలస్యంగా అందగలవు.

వీధిపోటు అనగానే ఒకటే ఫలితము అన్ని గృహాలకు ఒకటే విధంగా ఇస్తుందని భావించడం కూడా సరైన విధానం కాకపోవచ్చు. అనేక విధాలైనటువంటి వీధులు మరియు గృహాలు ఇతరత్రా విచిత్రమైన వంపులు తిరిగిన వీధిపోట్లు లెక్కకు మిక్కిలిగా గల కాంబినేషన్లతో కూడి వుంటాయి. కేవలం అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలకు మాత్రమే వీటి పసను గమనించగలరు. వారు మాత్రమే వీధిపోటు యొక్క ఫలితాలను చెప్పడానికి అవకాశం చాలా ఎక్కువ. ఉదాహరణకు కొన్ని గృహాలు మరియు కొన్ని వీధిపోట్లను చూడండి. సముద్రమంత సామర్థ్యం గల వాస్తు శాస్త్రాన్ని చెంబులతో కొలవడానికి వీలవుతుందా? ఇదొక మహాసముద్రం. దీనికి అంతు లేదు. లోతు తెలియదు అయితే దురదృష్టశాత్తు నేడు సమాజంలో చాలా మంది వాస్తు చూస్తామని బయలుదేరి ప్రజలను అనేక విధాలా ముప్పుతిప్పలకు గురి చేయడం తెలుస్తున్నది. అయితే మోసపోవడమే మన జన్మ హక్కులా కొందరు అమాయక జనులు మరియు కొందరు డబ్బుకు కక్కుర్తి పడిన జనులు ఇటువంటి వారి మాటలు విని ఎంతో కాలాన్ని, ధనమును వ్యర్థం

చేసుకోవడం మీరు కూడా గమనించే వుంటారు. మీ లోకజ్ఞానంకు ఇటువంటి విషయాలు ఎన్నో వచ్చి వుంటాయి. నేడు చాలా మంది విజ్ఞులు, భవిష్యత్తులో అభివృద్ధిని పూర్తిగా సాధించాలని కోరుకునే వారు పూర్తిగా వాస్తు విజ్ఞానం తెలిసిన పండితులను మాత్రమే తమ గృహానికి పిలుచుకు పోయి చక్కటి ఫలితాలను పొంది విజయాన్ని వరిస్తున్నారు. అందుకే వారు అభివృద్ధి బాటన పడుతున్నారు. డబ్బుకు కక్కుర్తి పడే కొందరు గృహస్థులు మిడిమిడి జ్ఞానం కలిగిన వాస్తు శాస్త్రవేత్తలని చెప్పుకునే కొందరి చేతుల్లో పొరపాట్లకు లోనై అభివృద్ధిని త్రుంచుకుంటున్నారు. విజ్ఞానం ఎవరి సొత్తు కాదు. విద్య ఎవరి ఆస్థి కాదు. సర్వేశ్వరుని అనుగ్రహం లేనిది ఎవ్వరూ ఏమీ సాధించలేరు. మనం కాస్త ఏదైనా విషయాన్ని సాధిస్తేనే అంతా మనగొప్ప అని చెప్పుకుంటాము. అది కూడదు. విజయాలను, అదృష్టాన్ని భగవంతుని దయగా భావించాలి. సర్వేశ్వరుని దృష్టి మనపై లేకపోతే మనము ఏమీ సాధించలేమని తెలుసుకున్న నాడు మనము

ఈ క్రింది పటాలను గమనిస్తే ఒక వీధి పోట్లలో ఇన్నేసి కాంబినేషన్లు వున్నాయా అనిపించక మానదు. అయితే నేను కొన్ని మాత్రమే స్థలాభావం వల్ల చూపించడం జరిగినది.




పై గృహమునకు తూర్పు ఈశాన్య వీధిపోటు ఉన్ననూ వేరే గృహము మొన 2వ నెంబర్ గృహమునకు తగులుతున్నది. ఇది అశుభ కారణము. 2వ నెంబర్ గృహము వీధిపోటు వల్ల శుభ గృహము అయిననూ ఫలితాలు ఆలస్యంగా అందును.




1వ నెంబర్ గృహము మొన 2వ నెంబర్ గృహమునకు తగులుతున్ననూ ఈశాన్య వీధిపోటులో ఏ దోషమూ లేదు. మంచి ఫలితాలకు ఢోకా లేదు.




వీధులు అనేవి అనేక రీతిలో వుంటాయి. వివిధ రకాల విధములుగా వీధులుంటాయి. ఇక వీధిపోట్ల విషయంలో లెక్కకు మిక్కిలిగా వుంటాయి. నాలుగు దిక్కులకు నాలుగు వీధిపోట్లు కాకుండా 8 దిక్కులు, 8 వీధిపోట్లు అనుకుంటాము.

ఇది కూడా సరిపోదు. 8 × 8 = 64 ఇన్ని రకాల వీధిపోట్లుగా పరిగణనలోకి తీసుకోవలసి రావచ్చు. ఒక దిక్కుకే ఎన్ని వీధిపోట్లు వచ్చాయో గమనించారు కదూ. మరి 8 దిక్కులకు ఎన్ని వీధిపోట్లు వస్తాయో గమనించాలి. అనేక విధాలైనటువంటి వీధిపోట్లు అనేక ఫలితాలను మోసుకు వస్తుంటాయి. అత్యంత పరిశీలనతో చూస్తే తప్ప వీటి విషయం బయటకు రాకపోవచ్చు. సాధారణంగా కనిపించే ఇటువంటి వీధిపోట్లే అనేకమైన అనర్థాలకు గురి చేయగలవు. రాయలసీమలోని ఒక జిల్లాలో రెండు సినిమా థియెటర్లు ఒకదాని మీద ఒకటి కట్టారు. ఈ సినిమా థియేటర్లకు రెండు వీధిపోట్లు కలవు. ప్రస్తుతము మనము చెడు ప్రాంతం నుంచి ప్రయాణం మొదలు పెట్టిన వీధిపోటు గురించి మాట్లాడుకుందాము.




పై సినిమా థియేటర్లకు ఉన్న వీధిపోటును ఉత్తర ఈశాన్య వీధిపోటుగా భావించారు. విపరీతమైన ధనాన్ని ఖర్చు పెట్టి గొప్ప నిర్మాణాన్ని చేపట్టి చిత్రాలను ప్రదర్శించడం మొదలు పెట్టారు. ఈ సినిమా థియేటరు ఈశాన్యం బ్లాకుగా అనుకోవచ్చును. అయితే తూర్పు, ఈశాన్యము దారి, ఉత్తర ఈశాన్య దారి లేదు. ఈ థియేటర్‌కు తూర్పు మరియు ఉత్తరము రోడ్డు కలదు. పొరపాటుగా భావించిన ఉత్తర ఈశాన్య వీధిపోటు అనేక విధాలైనటు వంటి అనర్థాలు కలుగుజేసింది. థియేటర్ మొదలైన 2, 3 సంవత్సరాలు చాలా బాగా జరిగి నేడు ఈ థియేటర్ల పేర్లు కూడా జనం నోళ్లలో మననం కావడం లేదు. వెలుగు నశించింది. నిరాశ ఆవహించింది. గొప్ప నిర్మాణం వీధిపోటు దుర్లక్షణాలను రుచి చూడడం జరిగినది. ఇటువంటి స్థలాలను, నిర్మాణాలను చూస్తే మనసంతా చేదుగా అవుతుంది. దాదాపుగా 2 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టారు. మంచి నిర్మాణం. అయితే నేడు వెలుగు లేక ఈసురోమంటూ దినాలను గడుపుతున్నది.

అయితే ముఖ్య విషయము ఏమంటే ఈ సినిమా థియేటర్లకు వాస్తు చూపించే నిర్మాణం గావించారు. వాస్తు శాస్త్రవేత్త ఏ రకానికి చెందినవాడు అయి వుంటాడో మీ ఊహకే వదిలివేస్తున్నాను. అనుభవం లేనప్పుడు గౌరవంగా అక్కడి నుంచి తప్పుకోవడము ఇరువురికి క్షేమకరము. అతను చేసిన పొరపాటు వల్ల ఎందరో కార్మికులు పని కోల్పోయారు, యాజమాన్యము నష్టాన్ని చవి చూసింది. యాజమాన్యంకు ఆ ఊరిలో మంచి పేరు ఉండడము గమనించాల్సిన విషయమే.

పూర్తి పరిపక్వత కలిగిన జ్ఞానం ఉన్న వాస్తు శాస్త్రవేత్త సాధారణంగా పొరపాట్లు చేయడు. చెడు పేరు తెచ్చుకోవడానికి ఏ శాస్త్రవేత్త కూడా సిద్ధంగా వుండడు. ఒక చిన్న పొరపాటు చాలు జీవితాన్ని అతలాకుతలం చేయడానికి.

మన గృహానికి వీధి ఏ భాగంలో తగులుతున్నదో ఎంత ముఖ్యమో ఆ వీధి ఎక్కడ నుంచి ప్రయాణం మొదలు పెట్టిందో కూడా అంతే ముఖ్యము.

ఇంకొక ఆశ్చర్యకరమైన విషయాన్ని గమనించండి. ఇంతకు మునుపు ఒక వీధి చెడు స్థానం నుంచి బయలుదేరి

గృహానికి మంచిస్థానంలో ప్రవేశం చేసింది. దాని ఫలితం చెడు ఇచ్చింది. ఇప్పుడు ఇంకొక విచిత్రాన్ని గమనించండి. ఒక వీధి అత్యంత ఉచ్చమైన స్థానంలో బయలుదేరి గృహానికి చెడు కలిగించే ప్రదేశంలో ప్రవేశం చేసింది. ఇప్పుడు ఆ గృహంలోని వారికి ఆ వీధి మంచి చేస్తుందా చెడు చేస్తుందా.

ఆశ్చర్యకర్యమైన విషయాలు వాస్తులో ఎన్నో ఉన్నాయి అనడానికి ఇది ఒక మచ్చుతునక. ఇంతకుముందు అశుభకరమైన స్థానం నుంచి వీధి ప్రయాణం గావించి గృహానికి శుభకరమైన స్థానంలో ప్రవేశం చేసింది. అయినను దాని చెడు బుద్ధి పోనిచ్చుకోక మున్సిపాలిటీలో చెత్త కుండీలో చెత్త పేరుకున్నట్లుగా గృహానికి చెడును వేసి చక్కా పోయింది. అయితే ప్రసస్తమైన ఈశాన్య భాగం నుంచి ప్రయాణం మొదలు పెట్టిన వీధి గృహానికి చెడు ప్రాంతమైన తూర్పు ఆగ్నేయంలో ప్రవేశం కావించింది. మరి ఈ గృహానికి మంచి ఫలితాలు వస్తాయా చెడు ఫలితాలు వస్తాయా.




వాయువ్య భాగం నుంచి ప్రయాణం అయిన వీధి పశ్చిమ వాయువ్యం గుండా గృహంలోకి ప్రవేశం చేసి చెడును వదిలింది. ఈ ప్రకారం పోతే ఉచ్చమైన ఉన్నతస్థానం నుంచి ప్రయాణం మొదలు పెట్టిన వీధి చెడు స్థానంలో ప్రవేశం చేస్తే ఏ ఫలితం ఇవ్వాలి. సమాధానం ఏమిటి? ఏది సరైన సమాధానం. రోడ్డుపై కారులో ప్రయాణం చేస్తుంటాము. సరైన విధంగా సక్రమైన రీతిలో ప్రయాణం గావిస్తే క్షేమకరంగా ఇంటికి చేరుకుంటాము. అదే ఏ చిన్న పొరపాటు జరిగినా ఏమవుతుందో కూడా చెప్పలేని పరిస్థితులు ఎదురవుతాయి. అనుభవం ఉన్న డ్రైవర్లకు క్షేమంగా ప్రయాణం చేయాలంటే ఎన్నో మెలకువలు తెలిసి వుంటాయి. రోడ్డుపై వెళ్లేటప్పుడు ఎన్నో క్యాలిక్యులేషన్స్‌లు వేసుకోవలసి వుంటుంది. నిదాన ప్రయాణంలో ఉన్నప్పుడు ఒక విధమైన క్యాలిక్యులేషన్స్, పూర్తి వేగంగా ప్రయాణం చేసేటప్పుడు ఇంకొక విధమైన క్యాలిక్యులేషన్స్ వేసుకోవలసి వుంటుంది. మన ఎదురు గుండా వెళ్లు వెహికల్‌ను దాటి ముందుకు వెళ్లు సమయంలో ఎదురుగా ఇంకొక వాహనము వస్తూ వుంటే వాహనం నడుపు చోదకుడు క్షణాలలో నిర్ణయాన్ని తీసుకొని వేగాన్ని పెంచి తన పక్కనున్న వెహికల్‌ను ఓవర్‌టేక్ చేసి ఎదురుగుండా వచ్చే వాహనం నుంచి తప్పించుకుని సాఫీ ప్రయాణాన్ని సాగిస్తాడు. లేదా వేగాన్ని పూర్తిగా తగ్గించుకొని తన ప్రక్కనున్న వాహనం వెనుకే మళ్లీ (ఓవర్‌టేక్ చేయకుండా) ఎదురుగా వచ్చే వాహనము వెళ్లి పోయిన తర్వాత తన ప్రక్కనున్న వాహనాన్ని ఓవర్‌టేక్ చేస్తాడు. ఇందులో ఏ చిన్న పొరపాటు జరిగినా లేదా, తన క్యాలిక్యులేషన్‌లో ఏ చిన్న కొద్దిపాటి పొరపాటు జరిగినను జరగబోయే పరిణామము చాలా భయంకరంగా వుంటుంది. ఆ సమయంలో ఏ నిర్ణయాన్ని తీసుకోవాలో వాహన చోదకుడికి మాత్రమే తెలుస్తుంది. ప్రక్కన కూర్చున్న వారికి ముళ్లపై కూర్చున్నట్లుగా వుంటుంది. ఆ క్యాలిక్యులేషన్స్ ఏవో తర్వాత నింపాదిగా ఎక్కడైనా కూర్చున్నప్పుడు తెలుపు అని అడిగినప్పుడు వాహన చోదకుడు కూడా మీకు

సంతృప్తి కలిగిన సమాధానాన్ని ఇవ్వలేక పోవచ్చు. ఏదో ఒక ముక్కలో చెప్పగలడు. కానీ ఆ సమయంలో మాత్రం అతను ఎన్నో క్యాలిక్యులేషన్స్‌ను వేసుకొని వుంటాడు. అవన్నింటినీ పూసగుచ్చినట్లుగా చెప్పాలంటే అతనికి వీలు కాకపోవచ్చు. అలాగే వీధిపోట్లలో కూడా ఎన్నో కాంబినేషన్స్, క్యాలిక్యులేషన్స్ ఉన్నాయి. శాస్త్రం అంత సులభమైనది కాదు. ముందుగానే చెప్పుకున్నట్లుగా ఈ వాస్తు శాస్త్రం సముద్రం అంత లోతైనది.

ముందు పటం గురించి ఏ ఆలోచన వచ్చింది. తూర్పు ఈశాన్యం నుంచి ప్రయాణం అయిన వీధి గృహానికి తూర్పు ఆగ్నేయ భాగంలో ప్రవేశం అవుతున్నది కదా. దీని ఫలితాలు ఏవి. ఈ గృహానికి తూర్పు ఆగ్నేయ ఫలితాలు వస్తాయి. అయితే పక్కాగా స్పష్టంగా తూర్పు ఆగ్నేయము కొట్టేంత బలమైన శక్తితో ఈ వీధిపోటు ఈ గృహాన్ని కొట్టదు. కాస్త తక్కువపాటి శక్తి గల తూర్పు ఆగ్నేయ శక్తిని ఈ ఇంటిపై ప్రసరింప చేస్తుంది. ఇంకోలా కూడా అనుకోవచ్చు. వాస్తు పాటించిన గృహంపై తూర్పు ఆగ్నేయ వీధిపోటు ప్రభావం ఎలా వుంటుందో అటువంటి పరిస్థితే ఈ గృహంపై ఉంటుంది.

అయితే ఇటువంటి గృహం పూర్తి వాస్తు రీత్యా నిర్మితమైనచో ఈశాన్యం నుంచి ప్రయాణమైన వీధిపోటు గృహానికి తూర్పు ఆగ్నేయం నుంచి ప్రవేశమవుతున్నది కదా. పూర్తి వాస్తు పాటించిన గృహమైనచో దాని చెడు ప్రభావం నుంచి చాలా మేరకు తప్పించుకున్నదవుతుంది. అది ఎలాగంటే ఒక ఇంగువ డబ్బీలో ఇంగువ అయిపోయినా వాసన ఎలా వస్తుంటుందో అటువంటి కొద్దిపాటి ప్రభావంను గృహంపై ప్రసరింపచేస్తుంది. కొన్ని పూర్తి మెళకువలను పాటించినచో ఆ కొద్దిపాటి చెడు దుష్పరిణామమును కూడా తొలగించుకోవచ్చును. అయితే పూర్తి ఫలితాల కొరకు ఆ గృహాన్ని ప్రత్యక్ష పరిశీలన చేయడం తప్పని సరి. కాగితాలపై రాసిన మాటలతో పనులు జరగవు. ప్రత్యక్షంగా గృహ పరిశీలన కావించినచో ఎక్కడ ఏ సవరణలు కావిస్తే దోషాలు తొలుగుతాయో ఆ సవరణలు మాత్రమే చేయవలసి వుంటుంది.

ఈశాన్య వీధిపోట్ల శుభాల గురించి చర్చిద్దాం :-

ఈశాన్యం వల్ల గృహస్థులకు ఏమైనా లాభమున్నదా? ఈ ప్రశ్న అడిగిన తక్షణమే సాధ్యమైనంత వరకు ప్రతి ఒక్కరూ ఈశాన్యం నుంచి పరిపూర్ణమైన శుభ ఫలితాలను పొందవచ్చునని తెలుపుతారు. అది ఈశాన్యం పెరగడం కానీ, లేదా ఈశాన్యం పల్లం రావడం కానీ ఈశాన్యం ద్వారం రావడం కానీ, ఈశాన్యంలో కిటికీలు రావడం కానీ, ఇతరాత్రా ఏదైనా శుభ పరిణామము ఈశాన్య భాగంలో జరిగినచో గృహస్థులకు అనేక శుభములు ఒనగూరును. ముందుగా మనం ఈశాన్యం శుభ ఫలితాల గురించి తెలుసుకుందాము. తర్వాత ఈశాన్య వీధిపోటు గురించి తెలుసుకుందాము. ముందుగా వీధిపోటు అంటే ఏమిటి.

**వీధిపోటు :-** వీధిపోటు గురించి స్పష్టంగా నవీన శాస్త్రవేత్తలు ఫలితాలు పేర్కొన్నారు. కాలం మారు కొద్దీ విజ్ఞానం ఎలా పెరుగుతూ వుందో అలాగే వాస్తు శాస్త్రంలో కూడా కొత్త కొత్త విషయాలు బయటకు వస్తున్నాయి. ఉదాహరణకు ఒక గృహస్థుని ఇంట రెండవ సంతానానికి మాత్రమే పోలియో ఎందుకు వస్తోంది. మొదటి సంతానానికి లేదా చివరి సంతానానికి రాకుండా మధ్య సంతానానికే పోలియో ఎందుకు వస్తోంది. ఇక్కడ నా అర్థమేమిటంటే లేదా ఇలా కూడా అనుకోండి. గృహస్థునికి మొదటి సంతానానికి మాత్రమే పోలియో ఎందుకు వస్తుంది. లేదా చివరి సంతానికి మాత్రమే పోలియో ఎందుకు వస్తుంది. గృహంలో ఏ వాస్తు లోపం వల్ల సంతానానికి పోలియో వస్తోంది. ఈ విషయంపై పరిశోధన జరిగింది. గృహములో ఏ వాస్తు దోషము వుంటే పోలియో వస్తోందో అనే విషయం పక్కన

పెడితే పర్టికులర్‌గా (ప్రత్యేకంగా) ఇంకా లోతుకు వెళ్లి పరిశోధన చేయాలని నిర్ణయించి రెండవ సంతానానికి మాత్రమే పోలియో వచ్చిన కుటుంబాల గురించి వెతకడం ప్రారంభించాము. మరియు మొదటి సంతానానికి తర్వాత చివరి సంతానానికి పోలియో వచ్చిన కుటుంబాల గురించి వెతికాము. అలాగే పక్షవాతం వచ్చి కుడి కాలు, కుడి చేయి పడి పోయిన వారి గురించి మరియు పక్షవాతం వచ్చి ఎడమ కాలు, ఎడమ చేయి పడి పోయిన వారి గురించి వెతకడం ప్రారంభించాము. ఇంకా లోతుగా పరిశీలన చేశాము. కుడి కాలుకు మాత్రమే పక్షవాతం వచ్చిన వారి గురించి వేట ప్రారంభించాము. మరియు ఎడమ కాలుకు మాత్రమే పక్షవాతం వచ్చిన వారి గురించి వేట ప్రారంభించాము.

కేవలం ఒక్క విషయం అనగా ఉదాహరణకు ఎడమకాలుకు పక్షవాతం వచ్చిన వారి గురించి విచారించాలంటే వారు ఎక్కడ దొరుకుతారు. ఏ ఇంట వారు వుంటారు. ఇత్యాది విషయాలను కనుక్కోవాలంటే శోదన ప్రారంభించాలి. ఉదయం 6 గంటలకే కాలకృత్యాలు, స్నానపానాదులు, పూజా కార్యక్రమాలు ముగించుకొని శోదనకు బయలుదేరే వారుము. ముగ్గురు, లేదా నలుగురు వీలైతే ఐదు మంది కలిసి వెళ్లే వారుము. కనీసం ఒక్క విషయాన్ని కనుక్కోవడానికి 600 నుంచి 700 ఫోన్ కాల్స్ చేసే వారుము. పది రోజులు కష్టపడి తిరిగితే తప్ప అది ఉదయం 6 నుంచి రాత్రి 10 వరకు శ్రమించాలి. ఫలహారాలు, భోజనాలు, కాఫీలు ఇతరాత్రా ఖర్చులన్నీ భరిస్తూ ప్రయాణం సాగించేవారము. ఓపిక ముఖ్యం. పది దినాల్లో ఫలితాలు దొరకవచ్చు. లేదా ఏ మాత్రము ప్రయోజనం లేకపోవచ్చు. మరి అంత కాలం చేసిన శ్రమ ఎక్కడికి వెళ్లింది. ఏ మాత్రం బాధ పడేవారము కాదు. వాస్తు శాస్త్రం అనంతం. దీని పరిశోధనలు జరుగుతూనే వుంటాయి. అందుకే నేను ఇప్పటికీ చెబుతాను నేటికీ నేను వాస్తు విద్యార్థినే. నా అనుభవము 60 సంవత్సరాలు అయినా కానీ నేను వాస్తు విద్యార్థిగానే వుంటాను. అంతేకానీ ప్రస్తుత నా 14 సంవత్సరాల అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని వాస్తు శాస్త్రంపై నాకు పూర్తి పట్టు గలదు, లేదా వాస్తుపై సర్వమూ పరిజ్ఞానం కలదు అని చెప్పుకోవడానికి లేదు. ఏ వాస్తు శాస్త్రవేత్త కూడా వాస్తుపై సంపూర్ణ పరిజ్ఞానం కలదు అని చెప్పడానికి లేదు. ఒకవేళ ఎవరైనా అలా చెప్పుకుంటుంటే వారిని నేను ఏమీ అనదలచుకోలేదు. పరిపూర్ణంగా నా భావన ఒక్కటే. అందుకే జగమెరిగిన మడమ తిప్పిన ఢంకా మోగించే ప్రఖ్యాత వాస్తు శాస్త్రవేత్తలు సైతం వాస్తు విద్యార్థిగానే చెప్పుకుంటారు. అంతేకానీ మాకు సర్వమూ తెలుసునని చెప్పుకోరు. వాస్తు శాస్త్రంపై సర్వమూ తెలిసిన వారు నా ఎరుకలో ఒక్కరే ఒక్కరు ఉన్నారు. ఆయన ఎవరో తెలుసా, మీరు ఊహించగలరా, ఆయనే భగవంతుడు.

ఇప్పుడు పక్షవాతం గురించి మాట్లాడుదాము. గృహము బయట పశ్చిమ భాగం బయలు ప్రాంతమై గృహమునకు మరియు ఈ బయలు ప్రాంతమునకు మధ్య ప్రహారీ గోడ లేకపోయినను కుటుంబ పెద్దకు పక్షవాతం వస్తుంది. అదే గృహంలో ఆ గృహస్థులు అలాగే వుంటే ఆ పక్షవాతం వచ్చిన వ్యక్తి మరియు ఆయనకు సేవలు చేసే వారు పీడింపబడుతూ వుంటారు. ఇంకాస్త ఎక్కువ కాలం గడిస్తే మరణం ఆసన్నమవుతుంది. పక్షవాతం రావడానికి ఇదొక్కటే (పశ్చిమ ప్రాంతం బయలు ప్రాంతం) కారణం కాదు. పశ్చిమ భాగంలో గృహానికి వాలు వరండా వున్నను పక్షవాతం వస్తుంది. గృహమునకు మరియు నైరుతి గదికి మధ్యలో ఏదైనా బాత్‌రూమ్ వుండి అది పల్లముగా వున్నచో పక్షవాతం వస్తున్నది. అయితే నైరుతి భాగంలో గది ఉన్నందు వల్ల ఇంటి పెద్దకు వచ్చిన పక్షవాతం నయమయ్యే అవకాశం కూడా లేకపోలేదు. పక్షవాతంతో పీడింపబడినను దాని ఛాయల నుండి వీరు చేసే ప్రయత్నాల వల్ల బయట పడిన సంఘటన కూడా గమనించాము. అలాగే నైరుతి భాగంలో గది లేక పోయినచో మరియు నైరుతి ఖాళీగా వుండి ఏ చిన్నపాటి గుంత లేదా పల్లమున్నను పక్షపాతం వచ్చిన వారు అనేక బాధలకు లోనై, లేదా

నడవడానికి ప్రయత్నం చేస్తూ కింద పడటం, తద్వార వచ్చిన అనేక సమస్యలచే కుటుంబమంతయూ పీడింపబడుటయు చివరికి పక్షవాతం వచ్చిన వ్యక్తి మరణించడము జరుగుతున్నది. ఆశ్చర్యకరంగా పక్షవాతం రావడానికి ఇంకొన్ని కారణాలు కూడా శోదనలో బయట పడ్డాయి. దక్షిణ భాగము పల్లమైననూ లేదా గృహమునకు తూర్పు ఈశాన్య భాగాలు మిశ్రు కలిగి ఉన్ననూ లేదా గృహం బయట ఈశాన్య భాగంలో భారీ భవంతులు వున్నను పక్షవాతం వచ్చిన సంఘటనను గమనించాము. అయితే వీరికి బోనస్‌గా ఆర్థిక నష్టాలు, సంఘంలో చెడు పేరు, కుటుంబ ప్రతిష్ట మంటగలిసే సంఘటనలు జరుగుతుండడం చూశాము. పరిశోధనలు చేయగా చేయగా చేయగా వాస్తు శాస్త్రం ఎంత లోతైనదో అర్థమైనది. కుడి కాలికి మాత్రమే పక్షవాతం వచ్చిన వారి గురించి వెతికినప్పుడు కొన్ని విషయాలు బయట పడ్డాయి. దక్షిణ నైరుతిలో బాత్‌రూం కలిగి నైరుతి భాగంలో ఒక ఉపగృహము ఉన్ననూ దక్షిణ నైరుతిలో గల బాత్‌రూం నీరు ఉత్తరం ప్రక్కకు పారుతున్నప్పుడు కుడి కాలుకు పక్షవాతం రావడము గమనించాము. ఇలాగ వెతుకుతూ పోతుండగా ఇంకొక నాలుగు సంఘటనలు మాత్రం కాస్త విభిన్నంగా కనిపించాయి. పై లక్షణాలు కలిగిన బాత్‌రూమ్ యందలి వాడుక నీరు తూర్పుకు వెళ్తుండగా ఎడమ కాలుకు పక్షవాతం రావడము గమనించాము. ఏదైతేనేం దక్షిణ నైరుతిలో బాత్‌రూమ్ వలన మరియు అందలి పల్లము వలన పక్షవాతం వస్తుందన్న విషయం బయట పడింది. అయితే ఈ బాత్‌రూమ్ ఉన్న చోట పై ఫ్లోరింగ్ లేకపోవటం చూసాము. తద్వారా ధన నష్టము మరియు ఆర్థిక ఇబ్బందులు, కుటుంబంలో కలతలు, ఇత్యాది సంఘటనలు చాలా గమనించడం జరిగినది.

పై వ్రాసిన సంఘటనలు కేవలం రెండు పేజీలు చదివినందుకే కొందరికి ఓపిక నశిస్తుంది. ఈ రెండు పేజీల కోసం మేము దాదాపుగా 20 దినాలు కుటుంబాన్ని వదిలిన రోజులున్నాయి. ఖర్చులు ఇతరాత్రా కూడా ఎన్నో భరించి శోదన చేసి ప్రజల ముందుకు తేవడం జరిగింది. అదే బుద్ధిమంతులైన పాఠకులైతే ఎన్ని పేజీలనైనా ఓపికగా, శ్రద్ధగా, వినమ్రతగా చదవగలరు. పరిశోధన చేసిన వారిని ప్రత్యేకంగా అభినందించడం జరుగుతూ వుంటుంది.

నేను ఒక్కడినే కాదు నాలాంటి వారు ఎందరో నవీన శాస్త్రవేత్తలు భార్యా బిడ్డలను మరియు ఊర్లను వదిలి ఎన్నో పరిశోధనలు గావించి అందించిన శాస్త్రమే నేటి నవీన వాస్తు శాస్త్రము. వీధిపోట్ల పూర్తి ఫలితాలు నేటి నవీన వాస్తు శాస్త్రవేత్తల పరిశోధనాంశాల ప్రతిభకు మచ్చుతునక మాత్రమే. వారి కష్టానికి ప్రత్యక్ష తార్కాణము.

వీధిపోట్ల విషయంలో కూడా ఎన్నో పరిశోధనలు గావించిన తర్వాత మాత్రమే వాటి ఫలితాలను తెలపటం జరిగింది. కొందరు ప్రాచీన శాస్త్రవేత్తల అభిప్రాయం ఏమిటంటే వీధి బయట ఉన్న వీధిపోట్లు గృహంలో ఉన్న గృహస్థులకు ఎటువంటి శుభములు ఇవ్వవని మరి కొందరు ఏ వీధిపోటు అయిననూ గృహస్థునికి శిరోవేధనేనని, మరి కొందరు అసలు వాస్తు శాస్త్రంలో వీధిపోట్ల అంశమే ప్రస్తావనకు తేవాల్సిన అవసరం లేదని ఇతరత్రా విషయాలు తెలుపుతుంటారు. వారి మాటలను అలా పక్కన వుంచితే నేటి ప్రత్యక్ష తార్కాణాలు తెలుపుతున్నదేమిటంటే నూటికి నూరు శాతము వీధిపోట్లు మరియు వాటి ఫలితాలు ఉన్నాయి.

మన గృహము, అందు ఈశాన్యం పెరిగినప్పుడు దాని శుభ ఫలితములు మనము అందుకుంటాము. ఉదాహరణకు క్రింద పటాలను గమనించండి. ఈశాన్యం పెరగటం మంచిది. ఆ విషయం మీకు బాగా తెలుసు. అది ఎంత పెరిగితే మంచిది అనే విషయం పక్కన పెడితే ముందుగా ఈశాన్యం పెరిగే పరిణామ క్రమాలను మరియు వీధిపోటు అయిన క్రమాన్ని తర్వాత రూపాంతరం చెందిన వీధిపోటును చూసిన తర్వాత మీకు వీధిపోటుపై పూర్తి పరిపక్వత కలిగిన సంపూర్ణ పరిజ్ఞానం, పరిశీలనా పరిక్రమ, పరిడవిల్లుతుందని క్రింది పటముల ద్వారా గమనించవచ్చు.

**సాధారణ గృహము**




**గృహానికే ఈశాన్యం పెరిగిన గృహము**




**గృహం బయట పెరిగిన ఈశాన్య భాగము**




పై గృహమునకు ఈశాన్య భాగం పెరిగినది. ఈ ఈశాన్య భాగం పెరగడమనేది గృహమును ఆనుకొని పెరిగినది. ఇలా గృహము దాటి ఈశాన్యం పెరగడము మంచిదా? కాదా? గృహానికి ఈశాన్యం లోపిస్తే చెడ్డ కానీ గృహానికి ఈశాన్యం పెరగడం వల్ల అనేక విధాల అభివృద్ధిని గృహస్థులు అందుకుంటారు. వీధిపోట్ల పరిణామక్రమాన్ని ఇప్పుడు మీరు గమనిస్తున్నారు. పరిణామ క్రమము చాలా ముఖ్యము. చివరికి వీధిపోటులా ఎలా రూపాంతరం చెందుతుందో గమనిస్తాము. దాని ఫలితాల గురించి తర్వాత పూర్తిగా తెలుసుకుందాము. తర్వాత ఇప్పుడు పరిణామాక్రమంలో ఇంకొక అంకానికి ప్రయాణం సాగిద్దాం.

**గృహము బయట ఈశాన్య భాగం కాస్త ఎక్కువుగా పెరిగిన నమూన పటము**




గృహమునకు ఈశాన్య భాగంలో రెండు విధాలుగా, రెండింతలుగా ఈశాన్యము పెరగడాన్ని చూశారు కదా. వీధిపోట్లలో తర్వాత పరిణామ క్రమం తెలుసుకుందాము. ఈ క్రింది పటాన్ని గమనించండి.

**వీధిపోటు ఎలా రూపాంతరం చెందుతున్నదో గమనించండి**




పై పటములో గృహానికి ఈశాన్య భాగంలో వీధిపోటు ఎలా పరిణామం చెందుతూ అభివృద్ధి అవుతున్నదో గమనిస్తున్నారు కదూ. అలాగే చివరికి అది ఎలా వీధిపోటులా మారిందో ఇక్కడ తెలుస్తున్నది.

**ఈశాన్య వీధిపోటు**




ఒక స్థలం వీధిపోటులా రూపాంతరం చెందిన దాన్ని గమనించారు కదూ. ఇక్కడ మీ అవగాహన కొరకు మాత్రమే స్థలాలను వీధిపోటులా రూపాంతరం చెందుతున్నట్లుగా చూపించి తెలపడమైనది. అంతేకానీ వీధులన్నీ ఇలా రూపాంతరం చెందుతాయనడం సరికాదు.

కొందరికి వీధిపోటు అనగానే తక్షణమే అర్థమవుతుంది. ఇంకొందరికి దాని ఫలితాలు కూడా వెంటనే బోదపడుతాయి. ఇంకొందరు అనుభవజ్ఞులకు వీధిపోటును చూడగానే తక్షణమే అది మంచి వీధిపోట, చెడు వీధిపోట, దాని ఫలితాలు ఏమిటి, దాని దోష నివారణా పద్ధతులు ఏమిటి అనే విషయాలు కూడా తక్షణమే మెదడులో మెదలుతాయి.

కానీ పుస్తకం వ్రాయునప్పుడు అనుభవజ్ఞులను దృష్టిలో పెట్టుకొని వ్రాయరాదు. ఏ మాత్రము శాస్త్రంపై అవగాహన లేని వారిని మరియు పరిపక్వత లేని వారిని దృష్టిలో వుంచుకొని పుస్తకమును తయారు చేయవలసి వుంటుంది.

ఉదాహరణకు పూర్తి వివరాలతో కూడిన ఒక పుస్తకమును ఏ మాత్రం వాస్తుపై అవగాహన లేని వారు చదివిన తర్వాత సంతృప్తి పడి ఆనందించి రచయితను అభినందిస్తారు. అదే కాస్త వాస్తు పరిజ్ఞానం కలిగిన వ్యక్తులు పుస్తకం చదివితే తమకు తెలియని ఇంకొన్ని విశేషాలు తెలుసుకున్నందుకు సంతోషించి అభినందిస్తారు.

అదే పూర్తి పరిజ్ఞానం కలిగిన వాస్తు తెలిసిన వ్యక్తి పుస్తకమును పై పై పేజీలు త్రిప్పి చూసి రచయిత పడిన కష్టాన్ని మనస్సులోనే అభినందిస్తారు. కాస్త మంచి వ్యక్తిత్వం ఉన్న వారు రచయితతో మాట్లాడి ప్రత్యేకంగా అభినందనలు తెలుపుతారు.

ఏ రచయిత అయినా సాధారణంగా ఏ మాత్రము వాస్తు శాస్త్రంపై అవగాహన లేని వారిని మాత్రమే దృష్టిలో వుంచుకొని పుస్తకమును తయారు చేస్తారు. నేను కూడా ఈ పద్ధతిని పాటించాలని భావించి పుస్తకమును తయారు చేయడం జరిగింది. అందుకే ప్రతి ఒక చిన్న విషయము పూర్తి వివరాతి వివరంగా సంపూర్ణంగా ఉన్నట్లు తెలుస్తోంది.

పై పరిణామ క్రమము చూసిన తక్షణము వీధిపోట్లపై అవగాహన బాగా పెరిగి వుంటుంది. వీధిపోటు అనునది గృహమునకు ఏ భాగములో తగులుతున్నది అన్నది ప్రధాన ఉద్దేశ్యము. మరియూ అది గృహమునకు ఏ ప్రాంతము నుండి ప్రయాణం మొదలు పెట్టింది కూడా ముఖ్యము. తద్వారా గృహమునకు ఆ ప్రాంతంలో స్థలము పెరిగితే ఎటువంటి ఫలితాలు వస్తాయో అటువంటి ఫలితాలే వీధిపోట్ల వల్ల గృహస్థులు అనుభవించవలసి వుంటుంది.

ఈ వీధిపోట్ల ఫలితాలు కూడా ఒక్కోక్కసారి తమ ప్రభావాన్ని హరించుకుంటూ లేదా విపరీతమైన శక్తిని పుంజుకుంటూ ఉన్నట్లుగా ప్రవర్తిస్తాయి. ఉదాహరణకు ఒక చెడు వీధిపోటు గృహమునకు తగిలినచో ఆ గృహస్థులను అనేక విధాలా ముప్పుతిప్పలకు గురి చేయును. అదే ఒక గృహమునకు పద్ధతి రీత్యా ప్రహారీ గోడలు నిర్మించి ఉన్నట్లు అయితే (**"శుభవాస్తు"** – నవీన వాస్తు శాస్త్ర పరిశోధనా గ్రంథము పుస్తకంలో ప్రహారీ గోడలు ఏ పద్ధతిలో నిర్మిస్తే గృహస్థులు శుభ ఫలితాలను పొందుతారో చాలా సంపూర్ణంగా వివరించడం జరిగినది) చెడు ఫలితాలు ఇచ్చే చెడు వీధిపోటు ప్రభావము హరింపబడును.

మన గృహము బయట గల భౌగోళిక పరిస్థితులన్నియూ అనగా అది వీధిపోట్లు కానీయండి, లేదా హెచ్చు తగ్గులు, మిట్ట పల్లాలు, కొండ గుట్టలు, సరస్సులు, ఇతర ఏ అంశమైననూ పరిసరవాస్తే. మన ప్రహారీ, ప్రహారీ లోపల గల గృహము అంతయూ గృహవాస్తు. ప్రహారీ దాటి బయటకు వెళ్ళామా అది అంతయూ పరిసరవాస్తే. ఈ పరిసర వాస్తు కూడా గృహంపై ప్రభావం చూపిస్తుంది. ఈ ప్రభావము అనునది మంచి గాని, చెడు గాని ఒక్కోసారి విపరీతము కావచ్చును. లేదా ఇంకోసారి అత్యంత సాధారణమైనదిగా కావచ్చును. ఈ మార్పు గృహముయందలి వాస్తుపై ఆధారపడి వుండును. అందుకే తల పండిన వాస్తు శాస్త్రవేత్తలు, మేధావులు గృహాన్ని వాస్తు శాస్త్ర రీత్యా నిర్మించుకోమని పదే పదే తెలుపుతారు. వాస్తు శాస్త్రరీత్యా నిర్మితమైన గృహములో నివశించు కాల పరిమితి అత్యంత

ప్రభావశీలతను చూపిస్తుంది. మంచి వాస్తు పట్టు గల గృహం యందు నివసించు గృహస్థులు మొదటి సంవత్సరంలో కాకపోయిననూ, దినాలు గడుచు కొద్దీ ఉత్తమ ఫలములను పొందగలరు. అదే ఎక్కువ సంవత్సరములు నివాస మున్నచో ఉత్తమ ఫలముల శాతము ఎక్కువగును. అవాస్తు గృహములలో ఎక్కువ కాలము నివసించడం మంచిది కాదు. కొద్ది రోజులు బాగున్ననూ, తరువాత జీవితంలో అనేక కష్టనష్టాలను ఎదుర్కొనవలసిన పరిస్థితులు దాపురించవచ్చును. అత్యంత జాగురూకతతో మనము మెలగవలసిన పరిస్థితులు వున్నాయి. మన ప్రయత్నం మనం చేయాలి. నిరుత్సాహంగా ఏ పనీ చేయవలసిన పనిలేదు. ఆత్మ విశ్వాసంతో ముందుకు నడవండి. విజయం మీ స్వంతం అగును.

వీధి పోట్ల విషయంలో దాని గుణగణములు తెలుసు కోవాలంటే ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త మాత్రమే దాని మూలాలను గుర్తించి దాని శుభా అశుభాలను బయట పెట్టగలడు. అనుభవం లేని మిడిమిడి జ్ఞానం కలిగిన వారికి ఈ వీధి పోట్లు విషయంలో పరిజ్ఞానం తక్కువగా వుండడం సహజం కాబట్టి వారు దీని అనుపానులు మరియు లోతుపాతులు తెలుసుకోలేరు. ఇటువంటి పరిస్థితులలో గృహములకు వీధి పోట్ల విషయములో సవరణలు చేసుకోవడానికి సరైన విధానము పాటించలేక ఫలితములు ఊహించినవి రాలేక పోవచ్చు.

గృహము బయట ఒక వీధి ఉండవచ్చును. కానీ ఆ వీధి, వీధి పోటు అయి గృహము అందలి వారిని అనేక విధాల కష్టనష్టములకు గురి చేయును. ఇటువంటి పరిస్థితులలో ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్త గృహ పరిశీలనకు వచ్చిన వెంటనే ఈ కనీ కనిపించని వీధి పోటును గుర్తించి గృహమునకు తగిన సవరణ కావించి గృహస్థుల బాధలను తొలగించగలడు.

ఈ వీధి పోట్ల విషయంలో ముక్కున వేలేసుకొని ఔరా అనిపించేంతటి మాయదారి వీధి పోట్లను గమనించవచ్చును. వాస్తు అనగా చాలా సులభంగా చెప్పడానికి అనుకూలమైన సబ్జెక్ట్ కాదు. అనేక విధాలైనటువంటి కాంబినేషన్‌లతో కూడిన మ్యాథమ్యాటిక్స్‌లాంటి మహాసముద్రమని చెప్పవచ్చును.

ఏదైనా ఒక క్రొత్త విషయం కనుక్కొని మొదటిగా ఒకరు పుస్తక రూపకంగా ప్రజల దగ్గరికి తెచ్చినప్పుడు అదేమీ ఆశ్చర్యమో తెలియదు కానీ అనేక మంది వెనువెంటనే బయటకు బయలుదేరుతారు, మేము కూడా ఈ విషయాన్ని కనుక్కున్నామని బయటకు చెప్పుకుంటారు. అంతెందుకు ఒక 20 సంవత్సరాల క్రితం వాస్తు అన్న పేరు కూడా మనము విని వుండక పోవచ్చు. అంతకముసుపు ఎవరు వాస్తు పాటించారో ఎవరు పాటించలేదో కూడా మనకు సరిగా అవగాహన లేకపోవచ్చు. మొదటిగా ఒక రచయిత (వాస్తు శాస్త్రవేత్త) పెద్ద ఎత్తున ప్రజల దగ్గరకు వాస్తు పుస్తకాలను తీసుకు వచ్చాడు. ఆ తర్వాత ఊహించనన్ని వాస్తు పుస్తకాలు అనేక రచయితలు రచయించి మార్కెట్‌లోకి వదిలారు. ఇంకొందరు ఇంకొక అడుగు ముందుకు వేసి వారికి వాస్తులో 40 సంవత్సరాల అనుభవము, 50 సంవత్సరాల అనుభవము వుందని ఎంతో అనుభవం గడించాము అని చెప్పుకుంటారు. అయితే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే వీరి వయస్సు 45 నుంచి 50 కూడా వుండకపోవచ్చు. అబద్ధం చెప్పినా అతికినట్లు వుండాలి. ముఖ్య విషయం ఏమిటంటే 50 సంవత్సరాల అనుభవం కూడా గలదు. అయితే వారు వెలుగులోకి, సమాజ మూలల్లోకి రాలేదు, మరియూ ఇష్టం చూపలేదు. పుట్టినప్పటినుండే వాస్తు పరిశీలన చేయడం ఎంతవరకు సాధ్యం కాగలదు. అసలు ఇది నమ్మదగిన విషమేనా? నిజాలు చెప్పుకుంటే తక్కువ అవుతామని ప్రజలు ఎక్కువ విలువ ఇవ్వక పోవచ్చునని ఇటువంటి మాటలు మాట్లాడుతుండవచ్చును. ప్రజలను తప్పుదోవ పట్టించడం ఎప్పటికీ శ్రేయస్కరమైన విధానము కాదు. నిజాలు చెప్పుకోవడం వలన భవిష్యత్తులో చాలా మంచి జరుగుతుంది. మన

మనుస్సును చంపుకొని ఏమి సాధించుకోగలము. ఉన్న విషయం చెప్పుకోవడం వలన ఎంతో గౌరవము మరియు ఆత్మ సంతృప్తి ఏర్పడుతుంది. అబద్ధం చెప్పడం వల్ల తాత్కాలిక గౌరవము మరియు తక్షణ ధనము చేతికి లభించవచ్చును. కానీ ఇది ఎక్కువ కాలము నిలబడదు. అసలుకే ఎసరు. ఉన్నది పోయే ఉంచుకున్నది పోయే రీతిలో సమాజంలో భ్రస్టు పట్టి తల ఎత్తుకోలేని పరిస్థితులు రావచ్చును. అదే నిజము చెప్పడం వల్ల గౌరవము మరియు ధనము కాస్త ఆలస్యంగా ధరికి చేరును. అయితే ఇది జీవితాంతం అంటి పెట్టుకుని వుంటుంది. రెండో విధానం మంచిదని నా ప్రగాఢ విశ్వాసము.

మన గృహం బయట ఆవరించివున్న వాస్తును పరిసర వాస్తు అంటామని మనం ఇంతకుముందే తెలుసుకున్నాము.

పరిసర వాస్తులో అనేక రూపములున్నవి. అవి గృహము బయట హెచ్చుతగ్గులు, వీధి పోట్లు, కొండగుట్టలు. చుట్టుప్రక్కల ఎత్తైన భవంతులు, కాలువలు, సరస్సులు, నదులు, అపార్ట్‌మెంట్లు, వీధులు ఇతరత్రా అన్నియు పరిసర వాస్తులోకి వస్తాయి. వీటన్నింటిలో అత్యంత శక్తివంతమైనది వీధిపోట్లు. శుభకరమైన వీధిపోటు బికారిని రాజును చేయగలదు. అశుభకరమైన వీధిపోటు ఏనుగును పీనుగులా చేయగలదు. మనము ఈ పుస్తకములో వీధి పోట్ల గురించి సాధ్యమైనంతవరకు సంపూర్ణంగా చర్చించుకుందాము. కంటికి కనిపించే వీధి పోట్ల గురించి కంటికి కనిపించని వీధిపోట్లు మరియు మాయదారి వీధి పోట్ల గురించి, దొంగవీధిపోట్ల గురించి చర్చిద్దాము.

ముందుగా కంటికి కనిపించే వీధిపోట్ల గురించి చర్చిద్దాము. ఈ కంటికి కనిపించే వీధిపోట్ల విషయంలో సవరణలు చేసుకోవడానికి తగిన ఉపాయాలు త్వరగా లభించే అవకాశం మెండు. ఈ వీధి పోట్లు ఎన్ని ఉన్నాయి. వీటిలో మంచివీధి పోట్లు ఏవి, చెడు వీధిపోట్లు ఏవి అను విషయములు పూర్తిగా చర్చిద్దాము. మొత్తం వీధి పోట్లను ముందుగా తెలుసుకుందాము.

1. ఈశాన్య వీధిపోటు
2. తూర్పు ఈశాన్య వీధిపోటు
3. తూర్పు వీధిపోటు
4. తూర్పు ఆగ్నేయ వీధిపోటు
5. ఆగ్నేయ వీధిపోటు
6. దక్షిణ ఆగ్నేయ వీధిపోటు
7. దక్షిణ వీధిపోటు
8. దక్షిణ నైఋతి వీధిపోటు
9. నైఋతి వీధిపోటు
10. పశ్చిమ నైఋతి వీధిపోటు
11. పశ్చిమ వీధిపోటు
12. పశ్చిమ వాయువ్య వీధిపోటు
13. వాయువ్య వీధిపోటు
14. ఉత్తర వాయువ్య వీధిపోటు
15. ఉత్తర వీధిపోటు

16. ఉత్తర ఈశాన్య వీధిపోటు.

పై 16 వీధి పోట్లలో శుభకరమైనవి మరియు అశుభకరమైన వీధి పోట్లు గలవు. ముందుగా శుభకరమైన వీధి పోట్ల గురించి తెలుసుకుందాము.

1. ఈశాన్య వీధిపోటు
2. తూర్పు ఈశాన్య వీధిపోటు
3. తూర్పు వీధిపోటు
4. దక్షిణ ఆగ్నేయ వీధిపోటు
5. దక్షిణ వీధిపోటు
6. పశ్చిమ వీధిపోటు
7. పశ్చిమ వాయువ్య వీధిపోటు
8. ఉత్తర వీధిపోటు
9. ఉత్తర ఈశాన్య వీధిపోటు.

ఇప్పుడు అశుభకరమైన వీధిపోట్ల గురించి తెలుసుకుందాము.

1. తూర్పు ఆగ్నేయ వీధిపోటు
2. ఆగ్నేయ వీధిపోటు
3. దక్షిణ నైఋతి వీధిపోటు
4. నైఋతి వీధిపోటు
5. పశ్చిమ నైఋతి వీధిపోటు
6. వాయువ్య వీధిపోటు
7. ఉత్తర వాయువ్య వీధిపోటు

ఈ వీధి పోట్లు అన్నియు ఒక గృహము లేదా ఒక స్థలముపై వాటి నీడను ప్రసరింపచేయునప్పుడు ఎటువంటి ఫలితాలను ఇస్తాయో సమగ్రంగా చర్చించాల్సిన అవసరం వుంది. క్రింద పటమును గమనిస్తే ఒక స్థలంపై పడు వీధిపోటు, దాని పేరు మరియు అది చెడు వీధి పోటా లేక శుభకరమైన వీధిపోటా అను విషయము తెలుసుకోవచ్చును.




ఒక స్థలము లేదా గృహమునకు ఒక వీధి పోటు వచ్చినప్పుడు అది శుభం కలిగించే వీధి పోటు అయినచో ఏ తాపత్రయము లేదు. అదే అశుభకరమైన వీధి పోటు గృహమునకు తగులుచున్నచో ఆ వీధిపోటు నుండి మన గృహమును కాపాడుకోవాల్సిన అవసరం వుంది. ఈ కాపాడుకోవడము అనునది అనేక విధాలు.

**వాస్తు శాస్త్ర రీత్యా గృహము నిర్మాణమైనప్పుడు శుభకరమైన వీధి పోటు గురించి :-**

1. సాధారణమైన పరి బాషలో చెప్పుకోవాలంటే రెండు ఎద్దులు లాగుతున్న ఒక ఎద్దుల బండి, బండిలో కూర్చొని సుఖ ప్రయాణం కావిస్తున్న మనిషి పరిస్థితి.

ఒక గృహము వాస్తు శాస్త్ర రీత్యా నిర్మితమైనప్పుడు ఆ గృహము బయట గల వీధి పోటు శుభకరమైనది అయినచో గృహము యందలి నివసించు గృహస్థులకు అనేక రీతిలో శుభములను కొనివచ్చును. గృహస్థులు ఏ కష్టములకు గురి కాకుండా సంతోషకరమైన జీవితాన్ని సొంతం చేసుకోగలరు. ప్రతిదినము ఒక పండుగలా వీరికి సాగిపోవును. వీరు ఏ కార్యక్రమము అనుకున్నను అది నిర్విఘ్నముగా జరిగి ఉత్సాహం కలిగించే సంఘటనలతో భవిష్యత్తు రంగుల మయమై విజయాన్ని స్వంతం చేసుకుందురు.

**వాస్తు శాస్త్ర రీత్యా గృహము నిర్మాణం కానప్పుడు శుభకరమైన వీధి పోటు గురించి :-**

2. బండిని లాగుతున్న ఒక ఎద్దు, ఇంకో ఎద్దు స్థానంలో మనిషి పరిస్థితి.

శుభకరమైన వీధి పోటు ఒక గృహమునకు తగులుతున్నచో ఆ గృహము వాస్తు శాస్త్ర రీత్యా నిర్మాణం కాని సమయంలో, ఆ గృహం యందు నివసించు గృహస్థులు శుభకరమైన వీధి పోటు ఫలితములను మరియు అశుభకరమైన గృహవాస్తు ఫలితములను పొందుదురు. మంచి, చెడు రెండూ ఏకకాలంలో ఆ గృహంపై ప్రభావం చూపును. ఖచ్చితంగా ఇక్కడ ఏ సమయంలో మంచి జరుగునో లేదా ఏ సమయంలో చెడు జరుగునో చెప్పటం కాస్త కష్టమే. అయితే అవాస్తు గృహంలో నివసించే వారికి అనేక విధాలైన కష్టాలు ఎదుర్కోవాల్సి వుంటుంది. ఇటువంటి అవాస్తు గృహములకు

శుభకరమైన వీధి పోటు తగులుతున్నచో అవాస్తు గృహ ప్రభావము గృహస్థులపై చాలా తక్కువగా వుండును. ఇటువంటి గృహము యందు నివసించే గృహస్థులు గృహమును వాస్తు శాస్త్ర రీత్యా సవరణలను కావించినచో అద్భుతమైన ఫలితాలు పొందగలరు.

**గృహము వాస్తు శాస్త్ర రీత్యా నిర్మితమై చెడు వీధి పోటు తగిలినచో :-**

3. బండిని లాగుతున్న ఒక ఎద్దు, ఇంకో ఎద్దు స్థానంలో మనిషి పరిస్థితి.

ఒక గృహము వాస్తు శాస్త్ర రీత్యా నిర్మితమై అశుభకరమైన వీధి పోటు ఆ గృహమునకు తగులుతున్నచో ఆ గృహముయందు నివసించే గృహస్థులు గృహము యందుగల శుభవాస్తు ఫలితాలను మరియు గృహము బయట గల చెడు వీధిపోటు ఫలితాలను పొందగలరు. ఇటువంటి గృహస్థులు చెడు వీధి పోటు నివారణా పద్ధతులను పాటించినచో మంచి ఫలితాలను పొందే అవకాశము చాలా ఎక్కువగా వుండును. ఏదీ ఏమైనను ఇటువంటి గృహస్థులు చెడు వీధిపోటు విషయంలో అశ్రద్ధ చేయక జాగరూకతతో ప్రవర్తించి తక్షణమే చెడు వీధి పోటు నివారణా పద్ధతులను పాటించడం చాలా మంచిది. అయితే స్వబుద్ధి ఉపయోగించకపోవడం శ్రేయస్కరము. ధనానికి వెరవక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను గృహానికి ఆహ్వానించి ఆయనచే గృహ పరిశీలన కావించి చెడు వీధి పోటు నివారణా పద్ధతిని ఆయనచే పొందడం మహోత్తమమైన పద్ధతిగా భావించవలెను. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోవడము సరైన విధానము కాదు. ముందుగనే విజ్ఞత ప్రదర్శించడం వల్ల గృహము యందు నివసించే గృహస్థులందరూ క్షేమముగా వుందురు. అయితే ప్రత్యేకించి ఇటువంటి పరిస్థితులలో చాలా మంది చేసే పొరపాట్లు మీరుకూడా చేయరాదని పై విషయాన్ని చర్చించడం జరిగినది. ఇటువంటి సంఘటనలు నేను ఎన్నింటినో గమనించడం జరిగినది. స్వబుద్ధి ఉపయోగించడం లేదా మిడిమిడి జ్ఞానం కలిగిన శాస్త్రవేత్తల సలహాలను పొంది అనేక కష్టాలను కొని తెచ్చుకోవడం కొరివితో తలకాయలను గోక్కున్న వారమవుతాము. ః

**గృహము అవాస్తు రీత్యా నిర్మితమై చెడు వీధి పోటు తగిలినచో :-**

4. బండిని లాగుతున్న మనిషి, బండిపై రెండు ఎద్దులులాగా పరిస్థితి వుంటుంది.

ఒక గృహము అవాస్తు రీత్యా నిర్మితమై, అనగా వాస్తు పాటించని గృహము అనుకోవచ్చు, దీనికి చెడు వీధి పోటు తగిలినచో పక్షవాతం వచ్చి కాలు పడిపోయిన వ్యక్తికి చేయ్యి విరిగితే ఏలాంటి బాధను మరియు నరకయాతనను అనుభవించునో అటువంటి పరిస్థితులను గృహస్థులు అనుభవించవలసి రావచ్చు. రోజుకో గండంలా దినదినము బాధలకు గురి అయి ఉన్న గౌరవము తగ్గి మాట నిలబడక అనేక విధాలైనటువంటి ఈతి బాధలను అనుభవించవలసి వచ్చును. ఒకవేళ ఇటువంటి గృహమే మీ ఇలాకాలో ఉన్నప్పుడు తక్షణమే వారికి మీ సలహాగా అనుభవజ్ఞుడైన శాస్త్రవేత్తచే గృహ పరిశీలన కావించుకోమని మరియు తగిన సవరణా పద్ధతులను పొందమని తెలపడం మీ ఆప్యాయతకు నిదర్శనం కాగలదు. ఒకవేళ గృహము అవాస్తు రీత్యా నిర్మితమై చెడు వీధిపోటు గృహమునకు తగిలినచో నా సలహాగా ఒక క్షణం కూడా ఆలస్యం చేయరాదని చెప్తాను. వినడం, వినకపోవడం వారి ఇష్టము. సాధారణంగా ఇటువంటి గృహస్థులు మంచి జరిగే మాటను వినడం కష్టం. ఎందుకంటే వీరు ఆ చెడు ప్రభావం గల గృహము మరియు చెడు ప్రభావం కలుగజేసే చెడు వీధిపోటు చేసే అశుభ ఫలితాలను అనుభవించి సరైన నిర్ణయం తీసుకోవడానికి మనస్సు అంగీకరించకపోవచ్చు. ఇలాగే కాలం జరుగుతూ పోతే చూస్తుండగానే వీరు అన్నీ కోల్పోవాల్సి రావచ్చు. అయితే దెబ్బలు పడగా పడగా కొందరు చివరికి మాట వింటారు. అయిననూ జరగవలసిన తతంగమంతయూ అప్పటికే జరిగి వుండవచ్చును. చేతులు కాలిన తర్వాత తీసుకునే ఏ చర్య కూడా స్వాంతన కలిగించలేక పోవచ్చు. భవిష్యత్తులో

ఎందుకు కొరగాకుండా జీవనము నెట్టుకొని రావాల్సిన పరిస్థితులు దాపురించవచ్చును. పుస్తక రూపకంగా అనేక మంది శాస్త్రవేత్తలు ఇప్పటికే గొంతు చించుకు అరిచినట్లుగా పదే పదే ఈ విషయాలను ఎన్నో పుస్తకాలలో తెలపడము జరిగింది. కారణం సమాజ శ్రేయస్సు. ప్రజలందరూ బాగుంటే సమాజం బాగుంటుంది. సమాజం బాగుంటే దేశం బాగుంటుంది. ఇదే యావ అనేక మంది నిజాయితీ గల శాస్త్రవేత్తలలో బహిర్గతమవుతూ వుంటుంది. చెప్పినప్పుడు వినడం విజ్ఞుల లక్షణము. చెప్పిన మాటలు చెవికి ఎక్కించుకోకపోవడం బుద్ధిహీనుల లక్షణము. ఎలాగూ మీరు విజ్ఞులే కాబట్టి సరైన పద్ధతిని పాటించండి. మీ జీవితాన్ని ఆనందమయం చేసుకోండి. మీకు అంతా మంచే జరగాలని భావిస్తూ ఈ విషయాన్ని పదే పదే తెలుపుకోవడం జరిగింది.

ఒకటే వీధి ఒక గృహమునకు శుభ ఫలితములను ఇవ్వవచ్చు అదే వీధి ఇంకొక గృహమునకు అశుభ ఫలితములను ఇవ్వగలదు. ఎంత ఆశ్చర్యమో గమనించాలి. వీధి మాత్రం ఒక్కటే, అయితే ఫలితాలు మాత్రం రెండు విధాలు. కానీ ఈ మాట మాత్రం వాస్తవము. ఉదాహరణకు :-




పై గృహమును గమనించండి. ఈ గృహము ఉత్తర వీధిలోనికి చొచ్చుకొని వెళ్లినందువలన ఈ గృహమునకు తూర్పు ఈశాన్య వీధి పోటు మరియు పశ్చిమ వాయువ్య వీధి పోటు ఏర్పడినవి.

తూర్పు ఈశాన్య వీధి పోటు మరియు పశ్చిమ వాయవ్య వీధి పోటు రెండూ శుభకరమైనవే. వీటి శుభా అశుభాల గురించి తర్వాత చర్చిద్దాము. ఈ ఉత్తర వీధే ఇంకొక గృహమునకు చెడు లక్షణములు కలిగించే వీధిలా మారుతుంది.

అదేలాగో క్రింది పటము ద్వారా గమనిద్దాము.




పై పటము ద్వారా మీకు ఇప్పటికే ఒక విషయము అర్థమై వుంటుంది. వీధి ఒక్కటే కానీ ఫలితాలు రెండు.

ఇంతకు ముందు పటములో ఇదే వీధి ఉత్తర వీధి అయినది. ఈ పటములో వీధి దక్షిణ వీధిగా మారినది. గృహము దక్షిణ వీధిలోనికి చొచ్చుకొని వచ్చినందు వలన ఈ గృహమునకు తూర్పు ఆగ్నేయ వీధి పోటు మరియు పశ్చిమ నైరుతి వీధిపోటు ఏర్పడుతున్నవి. వీటి శుభ అశుభాల, ఫలితాల గురించి తర్వాత చర్చిద్దాము.

ఇంకా మనకు సూక్ష్మంగా అర్థం కావాలంటే రెండు పటాలను ఒకటిగా చేస్తూ చూద్దాము.




ఇంతకు ముందు ఒక్కొక్క గృహమును విడిగా గమనించాము. ఇప్పుడు ఒక వీధిలోనే గల రెండు గృహాలను గమనిస్తున్నాము. ఇప్పుడు మనకు ఒక విషయం స్పష్టంగా అర్థమయింది. ఒకటే వీధి ఒక గృహమునకు మంచి చేస్తూ ఇంకొక గృహమునకు చెడు చేయడాన్ని చూడవచ్చును.

గృహము వీధిలోనికి చొచ్చుకొని వచ్చినప్పుడు ఎన్నో విషయాలను పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ఒక గృహము తూర్పు వీధిలోనికి చొచ్చుకొని వచ్చినప్పుడు ఒక ఫలితము మరియు పశ్చిమ వీధిలోనికి చొచ్చుకొని వచ్చినప్పుడు ఇంకొక ఫలితము ఉండును.

అనుభవజ్ఞులు మీకు దగ్గరలో లేకపోతే మీ గృహమును వీధిలోనికి చొచ్చుకొని వెళ్లునట్లుగా నిర్మాణం చేయవద్దు. వీధిలోనికి చొచ్చుకొని నిర్మాణం చేయుటం చట్టరీత్యా నేరం కూడా.

మూడు పటాలను ఒకటే ప్రాంతంలో చూడటం వల్ల మన అవగాహన ఇంకాస్త పెరుగును.







మూడు పటాలను ఒకటే ప్రాంతంలో గమనించడం వలన మనకు విషయం బాగా బోధ పడుతుంది.

ఇలాగే తూర్పు వీధి లేదా పశ్చిమ వీధికి ఇటువంటి మార్పులే వుంటాయి. గృహము వీధిలోనికి చొచ్చుకొని రావడం వల్ల ఇటువంటి పరిస్థితులు ఏర్పడుతాయి. కొన్ని సార్లు సూటిగా వీధే వచ్చి గృహమును తాకుతుంది. ఏది ఏమైనను ఏ గృహమైనా కూడా వీధిలోనికి చొచ్చుకొని వచ్చున్నట్లుగా నిర్మాణం చేయడం న్యాయసమ్మతము, సముచితము కాదు. ఏలనగా అందరూ ఇలా వీధిలోనికి గృహాలను చొచ్చుకొని వచ్చినట్లుగా నిర్మాణం గావించినచో

వీధులన్నీ చిన్నగా అయిపోయి అసలే జన సమర్ధంతో కిటకిటలాడుతున్న ఊళ్లు ఇంకా అనేక సమస్యలతో బాధ పడాల్సి వుంటుంది. వాస్తు రీత్యా మంచి ఫలితాలు వస్తాయని వీధుల్లోకి చొచ్చుకొని రావడము, చెట్లను కొట్టి వేయడము ఇవన్నీయూ రాబోయే వినాశనానికి కారణం కాగలవు. కొండకచో ఏదో ఒక నాటికి ప్రభుత్వం వారే ఊరిపై పడి ఆక్రమించిన భవంతులను కొట్టి వేయడం జరుగుతుంది. అదే మన హద్దులో మనముంటే ఏ బాధా లేదు. నేడు అనేక పట్టణాలలో ప్రభుత్వం వారు ఆక్రమించిన గృహాలన్నింటిని కొట్టి వేస్తున్నారు. మరియు వీధులు చిన్నగవుతున్నాయనే కారణంతో వీధులను వెడల్పు చేయాలనే ఉద్దేశ్యంతో గృహాలను కొట్టి వేయడం కూడా జరుగుతున్నది. ఇంత వరకు మీరు ఉత్తర వీధి లేదా దక్షిణ వీధిలోనికి చొచ్చుకొని వచ్చిన గృహములను పరిశీలించారు. ఇప్పుడు తూర్పు లేదా పశ్చిమ వీధిలోకి చొచ్చుకొని వచ్చిన గృహాన్ని పరిశీలిద్దాము.




గృహము తూర్పు వీధిలోనికి, చొచ్చుకొని వచ్చినప్పుడు ఆ గృహమునకు ఉత్తర ఈశాన్య వీధి పోటు మరియు దక్షిణ ఆగ్నేయ వీధి పోటు ఏర్పడును. వీటి శుభా అశుభాలపై తర్వాత చర్చిద్దాం.




గృహము పశ్చిమ వీధిలోనికి, చొచ్చుకొని వచ్చినప్పుడు ఆ గృహమునకు ఉత్తర వాయువ్య వీధి పోటు మరియు దక్షిణ ఆగ్నేయ వీధి పోటు ఏర్పడును. వీటి శుభా శుభాలపై తర్వాత చర్చిద్దాం.




రెండింటిని కలిపి ఒకే వీధిలో కలిపి గమనిస్తే ఎలా ఉంటాయో పై పటాన్ని గమనించడం ద్వారా తెలుసుకోవచ్చును. ఇప్పుడు అన్నింటిని కలిపి ఒకే ప్రాంతంలో గమనిస్తే ఇలా వుంటుంది.







పై పటాలను గమనించడం వల్ల మీ అవగాహన ఇనుమడించి వుంటుంది.

ఇంత వివరంగా చెప్పడానికి కారణం ఏమంటే కొందరికి ఈ వీధి పోట్ల విషయం చక్కగా అవగాహన వుంటుంది. అటువంటి వారికి ఇంత వివరణ కలిగిన విషయాన్ని చూడటం ఇబ్బందికరంగా వుంటుంది. కొందరికి అవగాహన తక్కువుగా వుంటుంది. అటువంటి వారికి ఈ వివరణ మంచి ఫలితాన్ని ఇస్తుంది మరియు బాగా అర్థమవుతుంది.

ఒక వీధిలోనికి గృహము చొచ్చుకొని వెళ్లినట్లుగా నిర్మించి ఉంటే ఎలా కనిపిస్తుందో ఇప్పటికి మీకు బాగా అర్థమై ఉంటుంది. అదే ఒక గృహంపై ఒక వీధి వచ్చి తగిలినప్పుడు ఎలా వుంటుందో కింద గమనించగలరు.




పై గృహమునకు ఉత్తర ఈశాన్య భాగం నుంచి వీధి వచ్చి తగులుతున్నది. ఈ గృహస్థులు గృహమును వీధిలోనికి చొచ్చుకొని వచ్చునట్లుగా నిర్మించినది కాదు. స్వతహాగా గృహమునకు ఒక వీధి ఉత్తర ఈశాన్య వీధి పోటు అయి తాకుతున్నది. ఇలా రక రకాలుగా వీధి పోట్లు వుంటాయి. స్వతహాగా తగులుతున్న చెడు వీధిపోట్లను కూడా చెడు వీధి పోట్ల నివారణా పద్ధతులను పాటించి సవరించుకోవచ్చును. స్వతహాగా తగులుతున్న శుభకరమైన వీధి పోట్ల గురించి ఇక చెప్పాల్సిన అవసరం ఏమీ వుండదు. ఇప్పుడు ఒక్కొక్క వీధిపోటు గురించి వివరంగా తెలుసుకుందాము.

ముందుగా ఈశాన్య వీధిపోటు గురించి చర్చిద్దాము.

## ఈశాన్య వీధిపోటు

ఈశాన్య వీధి పోటు గురించి తెలుసుకునే ముందు ఈశాన్యం గురించి కొద్దిగా తెలుసుకోవాల్సి వుంటుంది. **ఒక గృహమునకు (గృహము కానీ, స్థలము కానీ, ఫ్యాక్టరీ కానీ ఇతర ఏ నిర్మాణము అయినా కానీ) ఒక వీధిపోటు తగులుతున్నప్పుడు ఆ వీధిపోటు అనునది ఏ ప్రాంతం నుంచి వచ్చి గృహమునకు తగులుతున్నదో ముందుగా గమనించాలి. మన గృహమునకు ఆ ప్రాంతము శుభకరమైనప్పుడు ఆ శుభకరమైన ప్రాంత ఫలితాలను మన గృహమునకు వీధి అందించును. ఇక్కడ వీధి అనగా ఒక కొళాయి (పైపులు) అనుకోవచ్చును. ఒక ప్రాంతం నుంచి ఇంకొక ప్రాంతమునకు పైపుల ద్వారా నీటిని ఎలా అయితే పంపిణీ చేస్తామో అదే మాదిరి మన గృహమునకు కూడా వీధి పోటు అనునది నీటిని సరఫరా చేసే పైపులాగా మంచి లేదా చెడును గృహమునకు**

**అందించును.** ఇది వీధి పోటు చేసే కార్యక్రమము. ముందుగా గృహమునకు ఈశాన్య వీధిపోటు ఎలా తగులునో క్రింది పటం ద్వారా గమనించండి.




ఒక గృహమునకు తూర్పు మరియు ఉత్తరముల మధ్యలో గల ఈశాన్య భాగమునకు ఒక వీధి వచ్చి తగిలినప్పుడు ఆ వీధిని ఈశాన్య వీధిపోటు అందురు.

ఈశాన్య వీధిపోటు గురించి తెలుసుకునే ముందుగా ఈశాన్యం గురించి తెలుసుకోవడం మంచిదని నా అభిప్రాయం. ఈశాన్యం యొక్క ప్రాముఖ్యతను ముందుగా మనం గమనించాలి. అప్పుడే ఈశాన్యము విలువను మనము గ్రహిస్తాము. లేనిచో సాదాసీదాగా ఈశాన్యంను పట్టించుకోక పోయే అవకాశం ఎక్కువ. ఈశాన్యం పెరగడమనగా అభివృద్ధి దిశగా మన ప్రయాణం సాగుతున్నట్లుగా గ్రహించాలి.

ఈశాన్యము అంటే అభివృద్ధి. ఈ అభివృద్ధి అనేది ఏ విషయంలోనైనా కావచ్చును. వంశం కానీ, ధనం కానీ, గౌరవం కానీ, విద్య కానీ, సుఖ సంతోషాలు కానీ, భోగభాగ్యాలు కానీ, ఆరోగ్యం కానీ, వ్యాపారం కానీ, రాజకీయ సముచిత ఉన్నతాసనం కానీ, విదేశీ ప్రయాణం కానీ, ఆనందం కానీ, వాహనాలు కానీ, ఆస్థులు పెరగడం కానీ, సంఘంలో ప్రతిష్ఠ పెరగడం కానీ ఏదైనా కావచ్చును. ఆ అభివృద్ధికి బీజం వేయడంలో ఈశాన్యం అందవేసిన చెయి.

ఈశాన్యం గురించి ఇంతగా రాయడానికి కారణమేమిటంటే శుభముల గురించి తెలుసుకోవడం, చదవడం కూడా ఒక విధంగా మంచిదని భావించి వివరంగా తెలపడం జరిగినది మరియు ఈశాన్యం యొక్క ప్రసస్థతమైన ప్రాధాన్యతను ఇక్కడ చర్చించాలనే ఉద్దేశ్యంతో ఎక్కువగా రాయడం జరిగినది. తద్వారా ఈ పుస్తకము చదివిన వారందరూ ఈశాన్య ప్రాధాన్యతను గుర్తించి తగిన జాగ్రత్తలు తీసుకుంటారని ఆశించి చర్చించడం జరిగినది.

భోళాశంకరుడైన సర్వేశ్వరుడి అనుగ్రహ ప్రీత్యం ఈ ఈశాన్యం. సాక్షాత్తూ సర్వేశ్వరుని కొలిచిన పుణ్యం మీకు ఈశాన్యమును పెంచుకోవడం ద్వారా లభించును. మొత్తం వాస్తు అను శాస్త్రం ఈశాన్యము ప్రక్కగా వంగును. ఒక తక్కెడ తీసుకున్నచో రెండు ప్రక్కలా సరిసమానమైన కొలతల బరువులను ఉంచి నప్పుడే త్రాసు (తక్కెడ) సమతూకముగా తూగును. లేనిచో కుడి ప్రక్కకో లేదా ఎడమ ప్రక్కకో వాలును.

ఇక్కడ ఈశాన్యము ఒక పక్క, మిగిలిన దిక్కులు, మూలలు అన్నియూ ఒక ప్రక్క ఉంచిననూ వాస్తు త్రాసు (తక్కెడ) సరిసమానంగా చూపించును. ఈశాన్యము గురించి ఎంత చెప్పుకున్ననూ, తక్కువ చెప్పామేమో అన్న భావన కలుగును.

ఈశ్వరా, ఈశాన్యము. చూశారా ఈశ్వరుని నామములోనే ఈశాన్యము కూడా ఇమిడి ఉంది. త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర. బ్రహ్మ గురించి ఘోరమైన తపస్సు చేయవలసి ఉంటుంది అని మన పురాణాల యందు తెలపడం మరియు మనం తెలుసుకోవడం జరిగినది. అదే ఈశ్వరుని గురించి తపస్సు చేశారు అని వ్రాయడం కూడానూ మనం వినియే ఉంటాము.

బిడ్డకు తల్లి ఎలాగో, బిడ్డ ఏమడిగితే తల్లి ఆదరించి అందజేస్తుందో అలాగే దైవము, భగవంతుడు, సర్వేశ్వరుడు, ముక్కంటి, గరళకంఠుడు (విషాన్ని గొంతున నొక్కి పెట్టినవాడు), నీలకంఠుడు, విషకంఠుడు, గంగాధరుడు, సాక్షాత్తూ గంగను జటాజూటమునందు బంధించినవాడు, అడిగినవారి కోరికలు తక్షణం తీర్చువాడు, మల్లికార్జునుడు (చెవిటి మల్లయ్యగా పేరుగాంచినవాడు), అర్ధనారీ శ్వరుడు, ఆదిశంకరుడు, బ్రహ్మ సృష్టికి అతీతంగా జన్మించినవాడు, జననము లేనివాడు, మరణము లేనివాడు, తల్లిదండ్రులు లేనివాడు, (పురాణములలో ఎక్కడా ఈశ్వరుని తల్లిదండ్రుల గురించి వ్రాయని విషయం మీరు గమనించే ఉంటారు) త్రిమూర్తులలో ఒక భాగము, లయకారకుడు, అడ్డనామాలవాడు, శ్మశానవాసి, విభూదిధారి, అర్థనిమీలిత నేత్రుడు, కైలాసవాసి, నంది వాహనుడు, అష్టదిక్పాలకులకు అధిపతి, నాలుగు శిరస్సులు గల బ్రహ్మ యొక్క ఒక్క శిరస్సును కేవలం చూపుడువేలు చూపి దహించినవాడు. (అందుకే పిలకలు, చిన్న పిల్లలు, ఇంటియందలి విగ్రహాలను చూపుడు వేలు ద్వారా చూపకూడదని పెద్దలు అంటుంటారు. బ్రహ్మకు మూడు తలలు ఉండడమే మీరు చూసి ఉంటారు. చతుర్ముఖి అయిన బ్రహ్మ శివుని ఆగ్రహము చేత ఒక శిరస్సును కోల్పోయాడు)

ఈశ్వరునిలోని ఒక భాగమే ఈశాన్యము.

హరా అంటే భక్తా అంటాడు ఈశ్వరుడు.

శంభోమహదేవ, ఓం నమఃశివాయ అను నామములతో ఈశ్వరుని కటాక్షము కొరకై భక్తులు భక్తి పారవశ్యముతో జపిస్తూ ఉంటారు. ఈశ్వరుని తలచని వాడు, కొలచని వాడు హిందువేకాదు. వైష్ణవ మత పీఠాధిపతులు కూడాను ఈశ్వరుని ఏదో ఒక క్షణమైననూ కొలవడం కద్దు.

వేదాలను తనలో ఇముడ్చుకున్నవాడు, ( వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము) 108 ఉపనిషత్తులకు సృష్టి కారకుడు (108 ఉపనిషత్తులలో మొదటిది **ఈశా**వాస్యోపనిషత్తు కావడం గమనించాలి)

ఈశ్వరుని గురించి ఎలాగైతే ఎక్కువ చెప్పుకోవడానికి వీలుకాదో అలాగే ఈశాన్యం గురించి కూడా ఎంత చెప్పుకున్ననూ తక్కువగును.

అన్ని మూలలూ దిక్కులు చెడిననూ, ఈశాన్య మూల చెడకుండా ఉన్నతంగా ఉన్నచో అభివృద్ధి తగ్గదు. వాస్తు త్రాసు సూత్రమును మరవద్దు.

ఈ అభివృద్ధి అనేది ఈశాన్య భాగమునుండి మొదలగును. కొండకచో ఈశాన్యము లేనిదే అభివృద్ధి అసాధ్యమని చెప్పడానికి అవకాశం ఎక్కువ. ఈశాన్యము చక్కగా ఉన్న గృహము లక్ష్మీనివాస స్థాన సమము. (లక్ష్మీ నివాస స్థానము : *సత్యవంతులయందును, దైవభక్తుల యందును, సలక్షణమైన ఈశాన్యము పెరిగిన గృహములయందును, వీరుల యందును, జయధ్వజముల యందును, ఏనుగుల యందును, గోవుల యందును, ఛత్రచామరముల యందును, తామర పువ్వుల యందును, పంటభూముల యందును, పసిపాపల నవ్వుల యందును, పూదోటల యందును,*

రత్నములయందును, దీపములయందును, అద్దములు మొదలైన మంగళకారక వస్తువుల యందును, సౌభాగ్య లక్ష్మి నివశించును) ఈశా న్యము అభివృద్ధియున్న ఇల్లు పుణ్య స్థలమునకు సరిసమానము. ఈశాన్యమనగా భగవంతుడే. భగవంతుని ఇంకొక రూపమే గృహము యందు ఈశాన్య భాగము. భక్తి శ్రద్ధలతో భగవంతుని ఎలా ప్రార్థన చేసి పూజిస్తామో అంతటి భక్తి శ్రద్ధలను ఈశాన్య విషయంగా పాటించవలసి ఉంటుంది.

ఈశాన్యమును కోల్పోవడమనగా భగవంతుడిని, అభివృద్ధిని, వంశమును, ధనమును, సుఖసంతోషములను దూరం చేసుకోవడమే.

ఈశాన్యము గృహమునందు ఎక్కడ ఉండును !




పై పటమును గమనించారుగదా! గృహము లేక స్థలమునకు తూర్పు మరియు ఉత్తరముల మధ్య ఉన్న మూలను ఈశాన్యము మూల అని అందురు. ఇంటి యందు ఈశాన్య భాగము ఈ విధంగా ఉండును.




పై పటమును గమనించారు గదా ! ఇంటిని నాలుగు భాగాలు చేసినప్పుడు తూర్పు మరియు ఉత్తరముల మధ్యస్థలము అనగా పటము యందు చూపించిన 1,2,3,4 పాయింట్లలో ఉన్న భాగమును ఈశాన్య భాగముగా గమనించవలెను. మన మొత్తం ఇంటి స్థలములో ఈశాన్య భాగమునకు ఎంత ప్రదేశమును వదలాలి అను ప్రశ్న ఉదయించినప్పుడు, ఇందుకు సమాధానముగా ఇంటిని నాలుగు భాగాలుగా చేసినప్పుడు, వచ్చిన ఈశాన్య భాగమును

ఒక పుస్తకాన్ని తయారు చేయడమంటే ఎంత కష్టమో కేవలం రచయితకు మాత్రమే తెలుస్తుంది. లేదా రచన విలువ తెలిసిన పాఠకులకు తెలుస్తుంది. ఇతరులు దీని విలువ మరియు ప్రాముఖ్యత తెలుసుకోలేరు. సాధారణంగా పాఠకులు చక్కని విజ్ఞతను కలిగి ఉంటారు. అందుకే రచయిత యొక్క ఇతర రచనల కోసం ఆతృతగా ఎదురు చూస్తుంటారు.

2004వ సంవత్సరంలో శుభవాస్తు పుస్తకం వచ్చినప్పుడు ఒక గొప్ప వాస్తు సిద్ధాంతి నాకు ఫోన్ చేసి ఇంత చెత్త పుస్తకాన్ని ఎందుకు వ్రాశావు! నా జీవితంలో ఇంతటి ఘోరమైన పుస్తకాన్ని నేను ఎప్పుడూ చూడలేదు అని అన్నారు. తరువాత సంవత్సరంలో నాకు ఫోన్ చేసి మిగిలిన పుస్తకాలు ఎప్పుడు వస్తాయని ఎంతో గౌరవంగా మాట్లాడారు. ఆశ్చర్యపోవడం నా వంతు అయింది. నేను అడిగిన ప్రశ్నకు సమాధానంగా మాకు వయస్సు ఎక్కువ, నీకు వయస్సు తక్కువ, కానీ అపారమైన అనుభవాన్ని సంపాదించుకున్నావు అని అన్నారు. ఒక శాస్త్రమును రచించు సమయమున ఎన్నో సాధారణ విషయాలను పరిగణనలోకి తీసుకోవలసి వస్తుంది. అన్నీ విషయాలను క్రోడీకరించి పాఠకుల అమృత హృదయాలను తాకునట్లుగా రచన ఉండాలని నా అభిప్రాయము. అందుకే నేను వ్రాసిన పుస్తకాలను అడిగి మరీ కొనడం జరుగుతున్నది. ఇతర రచనలు ఎప్పుడు వస్తాయని అడిగే పాఠకుల సంఖ్య చాలా అధికమైనది. ఒక రచయితగా ప్రజలు ప్రేమగా ఇస్తున్న ఈ బహుమతులు జీవితంలో సరిపోవా! మీ అభిమాన వాత్సల్యము మరియు ఆశీర్వాదము వల్లనే నేడు మన www.SubhaVaastu.com వెబ్‌సైట్ ప్రపంచంలోనే అత్యంత పెద్దదిగా గుర్తింపు పొందినది. దినమునకు 25 వేల మందిపైన వెబ్‌సైట్‌ను చూడడానికి వస్తున్నారంటే అది కేవలం మీ సహకారము వల్ల మాత్రమే సాధ్యమైనది.

దాదాపుగా 10 సంవత్సరాలుగా ప్రతి e-books ను ప్రజలందరికీ ఉచితంగా అందజేయడం జరిగింది. అయితే నేడు ఒక మాసమునకు దాదాపుగా ఈ వెబ్‌సైట్ యొక్క ఖర్చు 50,000/- రూపాయలు దాటి పోతున్నది. అందువల్ల ఉచితంగా పుస్తకాలను ఇవ్వలేకపోతున్నాము. ఈ పుస్తకము నందలి మిగతా భాగమును చదవలెనన్న మీరు ఈ లింక్ యందలి బ్యాంక్ నందు 19 యు.ఎస్. డాలర్లను కట్టవలసిందిగా తెలుపుటకు బాధగా ఉన్ననూ తప్పడం లేదు. మన రూపాయలలో 500 రూపాయలను బ్యాంక్ నందు జమ చేయగలరు. బ్యాంక్ లింక్ :- http://www.subhavaastu.com/vastu-payments.html

ఎన్నో లక్షలు పోసి www.SubhaVaastu.com ను తయారు చేసిన విషయము మీకు తెలిసినదే. డెస్క్‌టాప్ వాల్‌పేపర్స్ దాదాపుగా 21,650 దాటి పోవడం మీకు తెలుసా. ఈ లింక్ ద్వారా వాల్‌పేపర్స్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చును. http://www.subhavaastu.com/wallpapers-section.html

ఇతర వాస్తు పుస్తకాల కొరకు ఈ లింక్‌ను క్లిక్ చేయండి. http://www.subhavaastu.com/free-vastu-ebook-downloads.html

our e-mail is : subhavaastu@gmail.com

త్వరలో భారతదేశంలోని అన్ని బాషల్లోనూ మన వెబ్‌సైట్ విడుదల కాబోతున్నది.

రచయిత
- సురేష్
సెల్ :- 098481 14778.